# "మమ్మీ, ఈ దురద, మంటను ఎలాగైనా ఆపవూ."



నైసిల్
ఉపయోగించండి
అతి శీఘ్రంగా
ఉపశమనమునిచ్చే
చెమటకాయల పౌడర్.




2 రకాల
డబ్బీలలో
దొరుకుతుంది.
'నీలం' మరియు
'చందనం.'

**నైసిల్ తెచ్చుకోండి**
**చెమటకాయల బాధ మరిచిపోండి.**

ప్రత్యేకమైన ఔ షధ యుక్త నైసిల్ చెమటకాయలను ప్రతి స్థితిలోనూ ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను నిరోధిస్తుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధాన్ని కల్గించే సూక్ష్మజీవులను నాశనం చేస్తుంది.
4. చర్మమునకు హాయి గొల్పుతుంది.

# సంపూర్ణ పోషకాహారంలో అన్ని పోషక పదార్థాలు సరియైన పాళ్ళలో వుండాలి...



# సిరిలాక్ సంపూర్ణ పోషకాహారాన్ని సిద్ధం చేస్తుంది— రుచికరమైన విధంగా.

మీ పాపకి నాలుగు నెలలు నిండి ఘన పదార్థాలు తీసుకోడానికి సిద్ధంగా వున్నప్పుడు, సిరిలాక్ గురించి మీ డాక్టర్‌ని సంప్రదించండి మీ పాపకి సిరిలాక్ ఆహారంగా యిచ్చిన ప్రతి పర్యాయము సంపూర్ణ పోషకాహారం యిచ్చామనే నమ్మకం మీకు మరొకసారి కలుగుతుంది

అనగా సిరిలాక్ యిచ్చిన ప్రతి పర్యాయము ఒక ఘన ఆహార పదార్థం నుంచి అవసరమైన అన్ని పోషకాలు మాంసకృత్తులు, కాలరీలు, పాపకి లభిస్తున్నట్లే అది యిస్తూ పోషక పదార్థాల లోపం తొలగించడానికి మరొకటి ఇవ్వవలసిన అవసరం లేదు

గోధుమ పిండి, పూర్తి మీగడ పాలు, పంచదార రుచికరంగా కలిపి వుండడం చేత సిరిలాక్‌కి ఈ సంపూర్ణ పోషకత్వం, రుచి లభించాయి శరీర నిర్మాణానికి మాంసకృత్తులు, శక్తికి పిండి పదార్థాలు, క్రొవ్వు పదార్థాలు, అన్ని విధాల పెరుగుదలకి అత్యంత అవసరమైన విటమిన్లు, ఖనిజాలు సిరిలాక్ అందచేస్తుంది

మీ పాపకి సిరిలాక్ యివ్వండి—పాప బాగుగా, ఆరోగ్యంగా పెరగడానికి




# సిరిలాక్®

పాలు వుండనే వున్నాయి



సిరిలాక్ తయారు చెయడం ఎంతో సులభం దీనిని ముందుగా మరగబెట్టిన గోరువెచ్చటి నీటికి చేర్చండి కలిపి వడ్డించండి

SAA/FSL/C/2670 TEL

NESTLÉ.

అందమైన పార్కులోని ఆహ్లాదం
ఏకాంతమైన బెంచీ ఇచ్చే ప్రశాంతం
వార్తా పత్రికతో మంచి కాలక్షేపం

కావాలి నాకిపుడు టోస్టెడ్ పొగాకు కమ్మదనం

టోస్టెడ్ రుచి ఇపుడు మరింత
మృదువు. నాకలాగే ఇష్టం మరి!

**చార్‌మీనార్ ఫిల్టర్**




ప్రపంచమంతటా లక్షలాది మంది
ఆనందించే టోస్టెడ్ పొగాకు కమ్మని రుచిని
మీరుకూడా ఆస్వాదించండి. ఇప్పుడు ఘాటు
లేకుండా మరింత మృదువుగా చేయబడి మీ పొగ-తాగే
ఆనందం కోసం చార్‌మీనార్ ఫిల్టర్‌లో మేళవించబడింది.

**CHARMINAR**
**FILTER**

Contract-CF-1021 TI

చట్టబద్ధమైన హెచ్చరిక: సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం
STATUTORY WARNING CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

# జి. ఆర్. ఎస్* కలిగిన
# క్రొత్త ప్రెస్టీజ్ ఒక్కటే అత్యంత
# భద్రమైన ప్రెషర్ కుక్కర్

క్రొత్త **ప్రెస్టీజ్**

Patent pending

గేస్కెట్ రిలీజ్ సిస్టమ్

Prestige
PRESSURE COOKER
Cook a whole meal in minutes

**100%**
**భద్రత**



### జి ఆర్ ఎస్ అంటే ఏమిటి?

గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ఒక విశిష్టమైన నమూనాలో రూపొందించబడింది నీరు మరగబెట్టడం ఎంతో నిరపాయకరమో ఈ సాధనంతో కూడిన ప్రెషర్ కుక్కర్‌తో వంటచేయడం కూడా అంత నిరపాయకరం ప్రెషర్ కుక్కర్ మూతలో ప్రత్యేకంగా అమర్చబడిన రంధ్రంద్వారా గేస్కెట్ అపాయకరమైన స్థితిని చేరిన ఆవిరి ఒత్తడిని అత్యంత భద్రంగా వదలివేస్తుంది జి ఆర్ ఎస్ అమర్చడంవల్ల క్రొత్త ప్రెస్టీజ్ పూర్తి భద్రతగల ఏకైక ప్రెషర్ కుక్కర్‌గా తీర్చి దిద్దబడింది



### అది ఎలా పనిచేస్తుంది?

వంట త్వరగా పూర్తవడానికి ప్రెషర్ కుక్కర్లన్నీ ఆవిరినే ఉపయోగించుకుంటాయి కొన్ని సమయాలలో కుక్కర్ లోపల ఆవిరి ఒత్తడి అవసరానికి మించి ఉంటుంది సాధారణ పరిస్థితులలో ఈ ఆవిరి ఒత్తడి కుక్కర్ మీది వెయిట్‌వాల్వ్ రంధ్రం ద్వారా బయటకు పోతుంది అయితే ఆహార పదార్థాలచే ఈ రంధ్రం కప్పివేయబడినప్పుడు కుక్కర్ ప్రేలిపోయే ప్రమాదం ఉంటుంది

క్రొత్త ప్రెస్టీజ్ లో ఎప్పుడైనా ఆవిరి ఒత్తడి అధికమైనప్పుడు ప్రెషర్ కుక్కర్ మూతలో అమర్చబడిన జి ఆర్ ఎస్ రబ్బర్ గేస్కెట్‌ను సాగేలా చేసి అధిక ఒత్తడిని అంతర్ముఖంగా భద్రంగా వదలివేస్తుంది



### జి ఆర్ ఎస్ ఎందుకు అవసరం?

మీరు సేఫ్టీ ప్లగ్‌ను మార్చవలసి వచ్చినప్పుడు మీకు నకిలీది లభించవచ్చు అవి అత్యవసర సమయాలలో సరిగా పనిచేయదు దురదృష్టవశాత్తు సేఫ్టీ ప్లగ్ నకిలీదో అసలైనదో మీరు గుర్తించలేరు ప్రమాదాన్ని ఎందుకు కొనితెచ్చుకోవాలి? **జి ఆర్ ఎస్ ఎన్నడూ విఫలంకాదు.**



### మామూలుగా వంటచేసే పద్ధతిలో జి ఆర్ ఎస్ జోక్యం ఉండదు

**ఉండనే ఉండదు అందులో మార్చడానికి ఏమీలేదు రబ్బర్ గేస్కెట్ ఆవిరిని వదలి పెట్టగానే మీరు చేయవలసిందల్లా శుభ్రంచేసి ఒక స్పూన్ సహాయంతో యథాస్థానానికి త్రోయడం మాత్రమే, తరువాత వెయిట్‌వాల్వ్ రంధ్రాన్ని శుభ్రంచేసి కుక్కర్ వాడండి**

చిన్నపిల్లలు సైతం నిర్భయంగా
వాడగలిగే భద్రమైన కుక్కర్ —
అదే గేస్కెట్ రిలీజ్ సిస్టమ్
కలిగిన "క్రొత్త ప్రెస్టీజ్"

* గేస్కెట్ రిలీజ్ సిస్టమ్

**TTK తయారి.**




ప్రెస్టీజ్ భారతదేశములో
ప్రెషర్ కుక్కర్‌ను ప్రవేశపెట్టినవారు

## సంపూర్ణ పోషకాహారంలో అన్ని పోషక పదార్థాలు సరియైన పాళ్ళలో వుండాలి...



# సిరిలాక్
# సంపూర్ణ పోషకాహారాన్ని సిద్ధం చేస్తుంది— రుచికరమైన విధంగా.

మీ పాపకి నాలుగు నెలలు నిండి ఘన పదార్థాలు తీసుకోడానికి సిద్ధంగా వున్నప్పుడు, సిరిలాక్ గురించి మీ డాక్టర్‌ని సంప్రదించండి. మీ పాపకి సిరిలాక్ ఆహారంగా యిచ్చిన ప్రతి పర్యాయము సంపూర్ణ పోషకాహారం యిచ్చామనే నమ్మకం మీకు మరొకసారి కలుగుతుంది.

అనగా సిరిలాక్ యిచ్చిన ప్రతి పర్యాయము ఒక ఘన ఆహార పదార్థం నుంచి అవసరమైన అన్ని పోషకాలు, మాంసకృత్తులు, కాలరీలు, పాపకి లభిస్తున్నట్లే. అది యిస్తూ పోషక పదార్థాల లోపం తొలగించడానికి మరొకటి ఇవ్వవలసిన అవసరం లేదు.

గోధుమ పిండి, పూర్తి మీగడ పాలు, పంచదార యిమిడంగా కలిపి వుండడం చేత సిరిలాక్‌కి ఈ సంపూర్ణ పోషకత్వం, రుచి లభించాయి. శరీర నిర్మాణానికి మాంసకృత్తులు, శక్తికి పిండి పదార్థాలు, క్రొవ్వు పదార్థాలు, అన్ని విధాల పెరుగుదలకి అత్యంత అవసరమైన విటమిన్లు, ఖనిజాలు సిరిలాక్ అందచేస్తుంది

మీ పాపకి సిరిలాక్ యివ్వండి—పాప బాగుగా, ఆరోగ్యంగా పెరగడానికి




# సిరిలాక్®
## పాలు వుండనే వున్నాయి




SAA/FSL/C/2670 ILL

NESTLÉ.

### ముఖచిత్రం

ఒకరి కౌగిలి మరొకరు
ఒకే బొట్టు ఒకే కట్టు
నది తీరం ఒడ్డు
నుదుట మధ్య కుంకుమ బొట్టు
చక్కని ఆ అందం తిలకించిన
ముఖచిత్రం మీ పత్రిక
కాదు —
అది మా పత్రిక
ఆంధ్రుల అభిమాన శుభ పత్రిక
మన ఆంధ్ర సచిత్ర వార పత్రిక !

ఎన్ అబ్బియమ్మ (డొన్నుంక పాలెం)

### జంట చిత్రం

25—3—83 ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖ చిత్రం, జయప్రద, శ్రీదేవిల జంటకన్నుల పంటగా ముచ్చటగొలిపే వయ్యారీల తంత నా మనస్సును అలజడి చేస్తున్నది

ఎస్. కృష్ణమూర్తి (వరంగల్)

### ఇద్దరు

ఇద్దరు మేటి తారల ముఖచిత్రాలతో వెలువడ్డ వార పత్రిక బహు ఆకర్షనీయంగా వుంది

ఎం లలితా నాగేశ్వరరావు (బైపల్లి)

* * *

అందాల తారల ద్వయం శ్రీదేవి, జయప్రదల ముఖ చిత్రారవిందంతో ఈ వారం పత్రిక కొంగ్రొత్త అందాలను సంతరించుకుంది

ఎం జగన్మోహనరావు పట్నాయక్ (విశాఖపట్నం)




శ్రీ దేవి, జయప్రద ముఖ చిత్రములతో వెలువడిన ఈ వారం (25—3—83) పత్రిక మా మనస్సులను దోచేసుకుంది. ఇంతవరకు ఎన్నో ముఖ చిత్రాలను చూసిన మేము ఈవారం ముఖచిత్రాన్ని చూసి ఎంత ఆనందించామో చెప్పలేక పోతున్నాము.

యం డి అస్లాం, ఇతరులు (ఇల్లెందు కాలరీస్)

### జీవిత సమరం

11—3—83 నాటి ఆంధ్ర సచిత్ర వార పత్రిక మేము ఆశించినంత ఆకర్షనీయంగా లేదు రాధిక రాధికలా అనిపించలేదు ఈ వారము వెలువడిన పత్రికలో జీవిత సమరం కథలో 13 వ పేజి 6 వ పేరగ్రాపులో మోహనరావు గదిలోకి వచ్చి లైటు వేసి తాపిగా ప్యాంటు చొక్కా, బనీను తీసి చారల లుంగి కట్టుకున్నాడు అని కథలో వ్రాశారు కాని పటములో శాండో బనీను తొడుక్కున్నట్లు బొమ్మ వేశారు !

శంకర్ (బొంబాయి)



### ఇద్దరు ముద్దు గుమ్మలు

తెలుగు చిత్ర పరిశ్రమలోనే కాక అటు హిందీ రంగంలోకూడా ప్రవేశించి ఉత్తరాది ప్రేక్షకులను కూడా ఉర్రూతలూగిస్తున్న ఇద్దరు అగ్రశ్రేణి అందాల కథానాయికలు శ్రీదేవి, జయప్రదల ముఖ చిత్రంతో వెలువడిన పత్రికను చూడటానికి రెండు కళ్ళు చాలవనిపించింది

సినిమా రంగంలోనే కాక అందచందాలలోను అలంకరణలోను, దుస్తుల ధరించిన విధానంలో కూడా పోటీ ఎడుతున్నట్లున్న ఈ ముద్దు గుమ్మలిద్దరిలోనూ ఎవరు ఎక్కువ అందంగా ఉన్నారనే విషయాన్ని ఖచ్చితంగా తేల్చుకోలేక పోయా ఇద్దరూ అందాలతారలే కావటం వలన ఎవరినీ తక్కువగా అంచనా వేసి తీసి పారేయటానికి వీలు లేక పోయింది

ఒకె కొమ్మకు పూచిన ముద్దబంతి పువ్వుల్లా వున్నారని చెప్పవచ్చు అయితే ఇటీవల నాలుగు వారాల క్రితమే జయప్రద ముఖచిత్రంతో పత్రికను వెలవరించి మళ్ళీ ఇంత తక్కువ వ్యవధిలో ఆ తారనే ముఖచిత్రంగా వెయ్యటం సమంజసంగా లేదు ఏమైనా ఈమధ్య జయప్రద బొమ్మ ప్రతి కవర్ పేజీపైనా, లోపలి పేజీల్లోనూ చాలా సార్లు చోటు చేసుకుంటోంది

జయసుధని మాత్రం పూర్తిగా తగ్గించేశారు, అలాగే శోభన్‌బాబు గారి ముఖ చిత్రం కూడా అసలు వెయ్యటం లేదు.

పి చంద్రశేఖర్, శ్రీ వాణి (కరీంనగర్)

(62 వ పేజీ చూడండి)

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938–1972]
శుక్రవారం 15–4–'83
దుందుభినామ సం నిజ ఫాల్గుణ బ విదియ
సంపుటము 75 : సంచిక 33
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ
*
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520 003

## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
'డార్లింగ్ డార్లింగ్ డార్లింగ్'
భాగ్యరాజా, పూర్ణిమా జయరామ్





లోకంపోకడ









# అసలు జరిగిందా ? జరుగుతుందనుకున్నదా !

న్యూఢిల్లీ లేఖ

డా॥ జయదుబాషీ

**ఒక** శాస్త్రవేత్త గొప్పతనాన్ని ఎలాగ అంచనా వెయ్యాలి ? అతను జరుగుతుందని చెప్పిన దానిని పట్టా, లేకపోతే అసలు జరిగిన దానిని పట్టా ? కార్ల్ మార్క్స్ ఒక గొప్ప శాస్త్రవేత్త అంటారు ఆయన అనుచరులు; ఆయన ఒక గొప్ప ప్రవక్తగా కీర్తి పొందారు, సందేహం లేదు కాని, చరిత్ర ఆయన చెప్పినదంతా పూర్తిగా తప్పు, అని నిరూపించిందా, లేదా ? ఆయన జరుగుతాయన్నవి ఇంచుమించు అన్నీ జరగనేలేదు "రాజ్యం" నశించిందా ? లేదు, ఇంకా పెద్దదయింది కార్మికులు సమాజానికి దూరం అయిపోయారా ? లేదే ! వాళ్ళు సమాజంలో ఒక ముఖ్యమయిన భాగం అయిపోయారు కదా ? వర్గరహిత సమాజం కూడా ఇంకా సుదూరంగానే ఉంది ఇదంతా ఇలాగే ఉండగా, కార్ల్ మార్క్స్ చెప్పినదంతా ఎలాగ ఉన్నప్పటికీ — ఇవాళ మానవులు ఆయన కాలంలో కన్నా స్వేచ్ఛగా ఉన్నారు, ఆయన అనుచరులు ఏలే దేశాలలో తప్ప చరిత్రని అర్థం చేసుకున్నాము, అనే వాళ్లని ఏడిపించేందుకే చరిత ఒక ప్రహసనం లాగ మారిపోతుందా అనిపిస్తూ ఉంటుంది ఈ వాస్తవాలన్నిటినీ పరిశీలిస్తూ ఉంటే

ఈ రోజు కార్ల్ మార్క్స్ బతికి ఉంటే ఆయన ముఖం ఎర్రగా ఉండేది సోవియెట్ రష్యాని తీసుకోండి ఇంతకన్నా నిరంకుశ పాలన కల రాజ్యం ఆధునిక కాలంలో ఉందా, హిట్లర్ జర్మనీని మినహాయిస్తే ? [హిట్లర్ కూడా ఒకప్పుడు మార్క్సిస్టే] సోవియెట్ రష్యాలో ఏమి జరిగిందో దానిబట్టి మార్క్స్‌ని విలువ కట్టకూడదు అంటారు మార్క్సిస్టులు ఇది అర్థంలేనిమాట. ఒక సిద్ధాంతం ఉందంటే, అది చెప్పినట్లు జరిగితేనే దాని గొప్పతనం అంతేకాని, కాగితం మీద మాత్రం కనిపించే వాదాల మూలంగా కాదు బ్రిటిష మ్యూసియమ్‌లో కూర్చోవచ్చు, కొన్ని ప్రభుత్వ — పత్రాలని సంపాదించవచ్చు, కొన్ని సంక్షేమ కేంద్రాలని సందర్శించవచ్చు — ఇదే చరిత్ర, అది ఇలాగ పరిణామం చెందుతుంది అనవచ్చు పోనీ, మార్క్స్ అన్న మాటలని వదిలివేద్దాము సోవియెట్ రాజ్యాన్ని స్థాపించినవారు తాము మార్క్సిస్టులమన్నారు, తమకి మార్క్స్ సిద్ధాంతాలే మార్గదర్శకంగా ఉన్నాయన్నారు వాళ్ళు చెప్పేదంతా అబద్ధం అని మన మొవరం అనేందుకు ? సోవియెట్‌రష్యాలో మార్క్సిసమ్ వక్రీకరించిందంటే దానికి కారణం మార్క్సిసమ్ అక్కడ నాటిన బీజాలలోనే ఉందనుకోవాలి కదా ? మార్క్సిస్టులకి మాటలంటే ఇష్టం సోవియెట్ రష్యాలో జరిగినదంతా మార్క్స్‌కి నచ్చి ఉండదంటూ వాళ్ళు దస్తాల మీద దస్తాల వాదాలు తయ్యారు చెయ్యగలరు ఎంత చేసినా ఉన్న మాట కాదనలేరు కదా ?

మార్క్స్ చెప్పినది ఏదీ జరగకపోవటం నాకు సంతోషంగా ఉంది అలాగే జరిగి ఉంటే ఘోరంగా ఉండేది ! మానవజాతి ఇప్పుడు ఏమి చెయ్యగలదో ఎవరూ చెప్పలేరు అందుకనే మానవజాతి చేసే పనులని ఆధారం చేసుకుని నిర్మించే సిద్ధాంతాలు ఎన్నటికీ నిలవలేవు

మార్క్స్ చెప్పినదంతా జరిగిందనుకోండి — సోవియెట్ రష్యాలో కావలసినంత స్వేచ్ఛ ఉండి అక్కడి పాలన ఎంతో జాలితో కూడిన విధంగా జరుగుతూ వచ్చిందనుకోండి, దీనాలోని జెయిళ్ళ నన్నిటినీ కళా పదర్శన కేంద్రాలుగా మారి, వేశారనుకోండి, మన మిత్రము ఫీడల్‌కాస్ట్రో చట్టా అంగరక్షకులు లేకుండా (ఆయనకి వచ్చే ప్రమాదం తోటి మార్క్సిస్టుల వద్దనుంచే కాని ఇతరుల వద్ద నుంచి కాదు కదా !) ఎక్కడికి కావాలిస్తే అక్కడికి వెళ్ళగలిగారనుకోండి, వియత్నామ్‌లో రచయితలనీ, కళాకారులనీ జెయిలులో పడవెయ్యలేదనకోండి — ఇంకేమీ, మార్క్స్ చెప్పిన స్వర్గాన్ని బాగా పోలి ఉన్నదే భూమి మీద వచ్చినట్లుగా ? అయినాసరే నాలాంటి వాళ్లకి మానవులు మానవులుగా ఉంటేనే బాగా ఉంటుంది. మానవుడు సఖుతం ఒక యంత్రం, అనే సిద్ధాంతం నిజం అయితే బాధపడే వాళ్ళలో నేనొకడిని కార్ల్ మార్క్స్ ఒక శాస్త్రవేత్తగా విఫలుడయ్యారు ఈ వైఫల్యంలోనే మనస్సు పదార్థం కన్నా గొప్పదన్న సత్యం ఇమిడి ఉంది ఒక సాంఘిక, రాజకీయ వాదంగా మార్క్సిసమ్ విఫలం కావడం మానవతా వాదానికి ఒక గొప్ప విజయం.

నిజానికి సాంఘిక "శాస్త్రా"లన్నీ వట్టివి. కీన్స్ సంగతే తీసుకోండి ఒక గొప్ప ఆర్థిక శాస్త్రవేత్తగా పేరు పొందాడు అతని జోలికే వెళ్ళరు ఈ రోజులలో. ఒకప్పుడేమో మార్క్స్ తర్వాత ఈయనే అనేవాళ్ళు. ప్రభుత్వం ఖర్చుపెట్టాలి, కాగితం డబ్బు అయినా సరే ఖర్చుపెట్టాలి, అలాగ చేస్తే, ఆర్థిక వ్యవస్థ బాగుపడుతుంది — అన్నాడు కీన్స్ బాగుపడటం అంటే నిరుద్యోగం ఒకరకం మాంద్యం తగ్గటం ఈ విధంగా వాణిజ్యాన్ని ప్రయివేట్ రంగం బారి నుంచి తప్పించవచ్చు కాబట్టి ఎందరో కీన్స్‌ని తెగ పొగిడేశారు ఆయన పరిస్థితులని అమూలాగ్రంగా మార్చివేసేవాడు, అన్నారు ఎందరో సోషలిస్టులు ఆయన భక్తులయ్యారు ఇక ఆర్థిక శాస్త్రం కూడా ఒక విజ్ఞాన శాస్త్రం లాగా మారిపోయింది. ఎక్కడ చూసినా లెక్కలు, కంప్యూటర్‌లు వగయిరా ..ఆర్థిక

శాస్త్రవేత్తలు తమ నిలబడిని ప్రారంభించారు

ఈ ఆర్థిక శాస్త్రవేత్తలంతా ఇప్పుడేరీ? యూరోపు, అమెరికా సంయుక్త రాష్ట్రాలలో నాలుగు సంవత్సరాలుగా పారిశ్రామిక మాంద్యం కొనసాగుతోంది, 250 లక్షల మంది నిరుద్యోగులుగా ఉన్నారు కాని ఒక్క ఆర్థిక శాస్త్రవేత్త అయినా ఈ సమస్యల పరిష్కారాన్ని సూచించ గలిగాడా? అసలు, నేటి సంక్షోభ విషయంలో ఏకాభిప్రాయం లేనేలేదు కొందరేమో ఒకటి చెబుతారు, మరికొందరేమో ఇంకొకటి చెబుతారు కమ్యూనిస్టులు "ఇదంతా పెట్టుబడిదారీ వ్యవస్థ వైఫల్యం" అంటారనుకోండి వారి మాటకి అర్థంలేదు కమ్యూనిస్టు దేశాల లోనూ సంక్షోభం ఏర్పడింది "ఎర్రసేనలు" ఉండబట్టే పోలాండు, ఇతర దేశాల ప్రభుత్వాలు పడిపోకుండా నిలబడ్డాయి నేటి సంక్షోభం పెట్టుబడిదారి వ్యవస్థ వల్లా వచ్చినదీ కాదు, ఇంక దేనివల్లా వచ్చినదీకాదు. ఇలాంటి సంక్షోభాలు పునరావృత్తమవుతూ ఉంటాయి మానవుడి జీవితమే అంత. ఎగుడూ, దిగుడూ తప్పవు. కొన్ని వృద్ధి పొందుతాయి ఆ తర్వాత క్షీణిస్తాయి చివరికి మాయమయిపోతాయి జీవితానికి సంబంధించిన సూత్రం ఏదయినా ఉంటే ఇదొక్కటే చరిత్ర అనేది మొదలయినప్పటి నుంచీ ఇలాగే జరుగుతుందనటానికి కావలిసినంత సాక్ష్యం ఉంది ఇంకా చెప్పాలంటే, ఇలాగ జరుగుతోందనటానికీ సాక్ష్యం ఉంది మార్క్స్ లాగ బ్రిటిషు మ్యూసియమ్‌లో కూర్చుని పుస్తకాలు చదివినాసరే, ప్రభుత్వం వారి కేంద్ర ఆర్థిక సంస్థ యొక్క నివేదికలు చదివినా సరే ఏమీ తెలియదు తెలుస్తుందనుకోవటం అవివేకం

ఆర్థికశాస్త్రం అనేది ఒక శాస్త్రం కాదు రాజకీయాలు కూడా ఒక శాస్త్రం కాదు. కీన్స్ కాని, మార్క్స్ కాని శాస్త్రవేత్తలు కారు మానవుడి దేహం తప్ప అతనికి సంబంధించినది ఏదీ ఉట్టి శాస్త్ర విషయం కాదు. అందుకనే ఆర్థిక సూత్రాలూ లేవు; రాజకీయ సూత్రాలూ లేవు భౌతికశాస్త్రం, రసాయన శాస్త్రంలో సూత్రాలు ఉన్నాయంటే అవి నిర్జీవపదార్థాలకి సంబంధించినశాస్త్రాలు కాబట్టే నిర్జీవ పదార్థాలతో మీ ఇష్టం వచ్చినట్లు చెయ్యవచ్చు కాని, మానవుడికి సంబంధించిన సూత్రాలంటూ తయారుచేసి వాటితో ఆడుకుంటే ప్రమాదాలు తప్పవు. కమ్యూనిజమ్, సోవియెట్ రష్యాలోని నిరంకుశ ప్రభుత్వం ఇటువంటి ప్రమాదాలే మానవుడి ప్రవర్తన ఒక నిర్ణీతమయిన పద్ధతిని అనుసరిస్తుందని నిరూపించటానికి ప్రయత్నించటం, మానవుడి స్వభావానికి రూపకల్పనలు తయారు చెయ్యటం వైపరీత్యానికి దారి తీస్తాయి మానవుడి చరిత్రలో ఏదో పద్ధతి కనిపిస్తుందని నిరూపించటానికి ప్రయత్నించి మార్క్స్ విఫలుడయ్యారు. విఫలుడవటమే మంచిది ఎందుకంటే ఆయన ప్రయత్నాలు ఫలించి ఉంటే మనల్ని మానవులనిపించే మానవత్వం మిగలకుండా పోయేది మనకి. ★

# సన్మానం

'రాణి మోహన్రావ్




"అక్కరకురానిచుట్టం

అనే పద్యాన్ని పదిసార్లు రాసి రేపు చూపించమ్మా" పరాంకుశం మేష్టారు అరుణ వేపు చూస్తూ అన్నాడు

పరాంకుశం మేష్టారు — పేరుకు తగ్గ మనిషి. ఓ పేరు పొందిన ఎలిమెంటరీ స్కూల్లో మేష్టరుగా పన్జేసి రిటైరై పోయేరు. అతనికిద్దరబ్బాయిలు. ఓ అమ్మాయి. అబ్బాయిలిద్దరికీ పెళ్ళిళ్ళు చేసేరు. వాళ్ళు మంచి ఉద్యోగాలు చూసుకుని వాళ్ళ భార్యలతో వేరే వెళ్ళిపోయేరు.

పరాంకుశం కూతురు కూడా బాగానే చదువుకుంది. పెళ్ళి సంబంధాలొస్తూనే వున్నాయ్ — పిల్లను చూసుకుని వెళ్ళిపోతున్నారు.

"పిల్ల బంగారంలా వుంది — మేం కాదనం .... కానీ మేష్టారూ మీరిస్తానన్న కట్నం ధరేబాగులేదు... (నచ్చలేదు), అన్నారో సంబంధంవారు ఈ మధ్యనే 'రాచూరి వారి' సంబంధం మాత్రం పిల్ల వచ్చిందని చెప్పి వెళ్ళిపోయేరు ఆ విషయం కనుక్కురావాలి వెళ్ళిరావాలంటే ఎలా లేదన్నా పాతికరూపాయలుండాలి అతనింట్లోనూ, అతని జేబులోనూ డబ్బులైపోయి వారం రోజులైంది తెలిసిన వాళ్ళందర్నీ అడిగేడు కొందరు సారీ మేష్టారూ అన్నారు.. మరికొందరు లాకేత్తం దాకొమ్ము(లేదు)అన్నారు. ఆఖరికి డాక్టరు రమేష్ నడుగుదామని నిశ్చయించుకున్నాడు పరాంకుశం —

డాక్టర్ రమేష్ ఆ నగరంలో పేరు ప్రఖ్యాతులున్న మనిషి. ఆయన లెక్కపెట్టే నన్నిసార్లు విదేశాలకు వెళ్ళేడు. రెండుచేతులా డబ్బు సంపాదిస్తున్నాడు. ఆయన 'వీరకేసరి' క్లబ్బుకు ప్రెసిడెంటు. ఆయనకు అరుణొక్కర్తే సంతానం. రమేష్ భార్య రాధాభాయ్ భర్తకు తగ్గ భార్య ఆమె మహిళామండలిలో కార్యదర్శి. విప్పు దా

క్లబ్బు వ్యవహారాల్లోనూ... మీటింగుల్లోనూ బిజీగా వుంటుంది అరుణ సంరక్షణ అంతా ఆయానే చూస్తూ వుంటుంది. అరుణ కెప్పుడైనా దెబ్బతగుల్తే 'అమ్మా' అని అరవదు.. 'ఆయా' అని అరుస్తుంది.

"మేష్టారూ..."

అన్న పిలుపుతో అంతవరకూ ఆలోచనా సముద్రంలో మునిగివున్న పరాంకుశం తేరుకుని "నువ్వింక వెళ్ళమ్మా" అన్నాడు

అరుణ పుస్తకాలు తీస్కుని వెళ్ళి పోయింది.

* * *

ఎయిర్‌కండిషన్ గది

హిమాలయంలా వుంది ....

పరాంకుశం శరీరం వేడెక్కిన కుంపట్లా వుంది.

డాక్టర్ రమేష్ విదేశీ మెడికల్ జర్నల్ దీక్షగా చదువుతున్నాడు.

ఆ గదిలో నిశబ్దం నాట్యం చేస్తోంది.

"బాబు" పరాంకుశం నెమ్మదిగా పిల్చేడు.

డాక్టర్ రమేష్ దీక్షగా, చదువుతున్న జర్నల్ మూసి తలెత్తి చూసేడు

పండినజుత్తు ... తీగె కళ్ళద్దాలు ... ముపలితవంచే కృంగిపోయిన శరీరం-ఖద్దరు లాల్చీ ... నీర్కావిపంచ వెలసి పరాంకుశం ఆకారాన్ని చూసి మొహం చిట్లించేడు డాక్టర్ రమేష్!

ఏఁవిటన్నట్టుగా చూసేడు .

"నాకో పాతిక రూపాయలు కావాలిబాబు అవసరం వచ్చింది..." అడగలేక...అడగలేక అడిగేడు పరాంకుశం.

మీకేకాదు నెలాఖరు మాకూనూ . అన్నట్టుగా పరాంకుశంవేపు చూసి "సారీ మేష్టారూ! నా దగ్గరా సమయానికి లేవు" అన్నాడు డాక్టర్ రమేష్.

* * *

"ఏఁవిటోయ్ — అర్జంటుగా రమ్మన్నావ్ ?" కుషన్ కుర్చీలో కూర్చుంటూ అన్నాడు రాజారావ్

రాజారావ్ వీరకేసరి క్లబ్బుకు సెక్రటరీ .. అంతేకాదు పేరుపొందిన పెద్ద కంట్రాక్టర్...నగరంలో చాలా భవంతులు ఆయనచేతిమీదే కట్టబడ్డాయ్ రాజారావ్ నల్లగా పొట్టిగా దిమిశాదుక్కలా వుంటాడు. ఆయనెంత వలుపో అంత నల్లధనం ఆయన్దగ్గర వుందని ఆయనంటే కిట్టనివాళ్ళు అంటూ వుంటారు.

"కారణంలేన్దే మనవాడు రమ్మనడు ఏదో విశేషం వుండే వుంటుంది..." రమేష్ వేపుచూస్తూ అన్నాడు మధుమూర్తి.

మధుమూర్తి వీరకేసరీ క్లబ్బుకు ట్రెజరర్. నగరంలో పేరుపొందిన క్రిమినల్ లాయర్. మధుమూర్తి తీసుకునే కేసులన్నీ గెలుస్తాయ్ అందుకే చాలామంది ఆయన్ని! 'ఖూనీల మూర్తిగారని'ముద్దుగా పిలుస్తారు. ఆయనీ వృత్తిలో బాగానే ఆర్జించేడు. మధుమూర్తికి సాంఘికసేవా కార్యక్రమాల్లో ఆశక్తి హెచ్చు. అందుకే మధుమూర్తి ఆ కార్యక్రమాల్లో ముందంజ వేస్తూ వుంటాడు

'చెప్పవయ్యా, మహానుభావా! సస్పెన్స్‌లో ముంచక' రాజారావ్ చిరాగ్గా అన్నాడు

'చెప్తా-బ్రదర్-చిరాకుపడకు ' సైపు పొగ గాల్లోకి వదులుతూ తాపీగా అన్నాడు డాక్టర్ రమేష్

మిత్రులిద్దరూ రమేష్ ఏంచెప్తాడా అని ఆత్రంగా రమేష్ వేపే చూస్తూ వున్నారు

"మనం, ప్రతీఏటా మన వీరకేసరీ క్లబ్బు ద్వారా ఏదో మంచి పన్జేస్తూనే వున్నాం" చెప్పటం ఆపేడు డాక్టర్ రమేష్.

"జాను చేస్తూనే వున్నాం కాదని ఎవరన్నారు ? " కోర్టులో ముద్దాయిని క్రాస్ ఎగ్జామిన్ చేస్తున్నట్టుగా ప్రశ్నించేడు మధుమూర్తి.

"ఈసారి వో ఘనకార్యం చేద్దామని ... ఆ ఆలోచన"

"ఓయస్ ... అలాగే కానిద్దాం ..." రాజారావ్ నవ్వుతూ అన్నాడు

"మన నగరం రోజు రోజుకూ బజార్లో ధరల్లా జనంతో పెరుగుతోంది. దానితోపాటు మురికిప్రాంతాలు కూడా వృద్ధి ఔతున్నాయ్! కాబట్టి మురికి వాడలు శుభ్రం చేద్దాం—" మధుమూర్తి అన్నాడు.

"నో.. నో ..అలాచేస్తే ఏంలాభం.. మన ఫొటోలు మాత్రం దినపత్రికల్లో అచ్చవుతాయ్!" పెదవ్విరుస్తూ అన్నాడు రాజారావ్.

"నేనో-ఐడియా చెప్పనా !" రమేష్ ఇద్దరివేపూ చూస్తూ అన్నాడు.

"చెప్పవయ్యా"

రాజారావ్ — మధుమూర్తులు ఏక కంఠంతో అన్నారు

"ఈసారి మన సంస్థ ద్వారా ఓ పండితుణ్ని ఘనంగా సన్మానిద్దాం-అందుకు గాను మనం విరాళాలను విరివిగా సేకరించాలి! ఏఁవంటారు ?"

"నీ ఆలోచన దివ్యంగా వుంది! బ్రదర్" అర్చేడు రాజారావ్.

"ఇంతకీ ఎవరా పండితోత్తముడు ?" మధుమూర్తి అడిగేడు

"మనకు విద్యాదానం చేసిన పరాంకుశం మేష్టారికి మనం మన వీరకేసరీ క్లబ్బు ద్వారా సన్మానిద్దాం! ఈ విధంగా నయినా ఆయన ఋణం మనం తీర్చుకుందాం"

"నీ ఆలోచన బాగానేవుంది రమేష్! కానీ! ఆయనకు సన్మానాలు, పొగడ్తలు గిట్టవే! ?" మధుమూర్తి సందేహంగా అన్నాడు.



ఆ విషయం గురించి మనేం వర్రీ అవకు ... ఈ కార్యక్రమం జయప్రదం అయ్యేందుకు మీరు సహకరిస్తే చాలు ... అదే పదివేలు

"అలాగే బ్రదర్" అన్నారిద్దరూ !

* * *

"నాకీ వయస్సులో సన్మానం ఏమిటి బాబు" పరాంకుశం మేష్టారు రాజారావ్ - చెప్పిందంతా విని అన్నాడు "మీరలా అనటానికి వీల్లేదుసార్ మీ దగ్గర చిన్న తనంలో ఎన్నో పాఠాలు నేర్చుకున్నాం — ఆ నాడు మీరు నేర్పిన పాఠాలు—మా జీవితంలో ఎన్నో గుణపాఠాలు నేర్పేయ్" రమేష్ భక్తిగా అన్నాడు

"అంతేకాదు మేష్టారు మేం తప్పుచేస్తే ఆనాడు మీరు పేంబెత్తంతో మమ్మల్ని బాదేవారు- ఆ దెబ్బలు మేం తినబట్టే (నిజ) జీవితంలో ఈనాడు ఎదురయ్యే ఎదురు దెబ్బలు తట్టుకో గల్గుతున్నాం కాబట్టి, మేష్టారూ మీరు కాదన్నా మా దృష్టిలో మీరే యోగ్యులు, పండితులు మాకు విద్య దానం చేసిన దాతలు అందుకు మేము మీ ఋణం తీర్చుకుందామని నిశ్చయించుకున్నాం మా క్లబ్ ద్వారా మిమ్మల్ని ఘనమైన పర్సుతో సన్మానిద్దామనుకున్నాం మా కోరికను మన్నించండి" రాజారావ్ వినమ్రతగా అన్నాడు.

బ్రహ్మాస్త్రానికి లొంగిన ఆంజనేయునిలా రమేష్ రాజారావ్ల మాటలకు పరాంకుశం లొంగిపోయేడు

* * *

## సన్మానం

క్లబ్ ఆవరణంతా రంగుదీపాలతో దేదీప్యమానంగా వుంది ముందుగుండు సామాన్లు పేల్చేరు – మేళతాళాలతో – వేదమంత్రాలతో పరాంకుశం మేష్టార్ని వేదిక నెక్కించారు. స్థానిక ప్రముఖులు మేష్టార్ని అతిశయోక్తులతో ఆకాశాని కెత్తేసేరు. కొందరు బృహస్పతని, మరికొందరు అభినవ వ్యాసుడని అన్నారు స్థానిక అర్జంటు కవులు కంద పద్యాలతో, కవిత్వాలతో కొనియాడారు.

తమ వీరకేసరి క్లబ్ చరిత్రను, తమ స్వంత చరిత్రను కొంతసేపు చెప్పుకుని ఆ తర్వాత పరాంకుశం మేష్టార్ని పొగడ్తలతో మునగచెట్టెక్కించి, ప్రజల సమక్షంలో ముఖ్య అతిథి ద్వారా పరాంకుశం మేష్టారికి పర్సు యిప్పించేడు డాక్టర్ గనేష్ కరతాళధ్వనులు మిన్నుముట్టేయ్ !

పర్సు అందుకున్న పరాంకుశం కళ్ళు ఆనందంతో చెమర్చేయ్ ! కుర్చీలోంచి లేచి మైకు ముందుకొచ్చి నిల్చున్నాడు ఆయనకు ఎప్పుడూ మైకు ముందు మాట్లాడే అలవాటు లేదు అందుకే మైకు ఆయన మాటలను మింగలేకపోయింది.

సభలో వికవికలు

పక పకలు ..

గోల గోల...

ఒకటే గోల

ఎవరి మానాన వారు ఏవో మాట్లాడు కుంటున్నారు . .

### అన్నపూర్ణ పండిస్తా !

ఆకలి మంటల్ని
నా స్వేద జలంతో ఆర్పేస్తా
నిరాశా మరుభూముల్ని
నా శ్రమ నాగలితో దున్నేస్తా
ఆశల బీజాలు నాటి
అన్నపూర్ణ పండిస్తా !
నా దండల కండలతో
కొండల్ని పిండి చేస్తా.

- చక్కిలం విజయలక్ష్మి

ఏదో మాట్లాడి సగం నింపిన గోనె బస్తాలా కుర్చీలో కూలబడ్డాడు పరాంకుశం

ఎవరో చేసిన వందన సమర్పణతో పరాంకుశం మేష్టారి సన్మానసభ ఘనంగా సమాప్తమైంది

* * *

ఆ రాత్రి !

డాక్టర్ రమేష్ ఇంట్లో !!

మిత్రత్రయం అంతా కల్సేరు వాళ్ళ మొహాల్లో ఆనందం తాండవిస్తోంది ! పరాంకుశం మేష్టారి సన్మానం అనే నోముకు "వెట్ పార్టీ"తో ఉద్యాపన చేస్కున్నారు.

అదేరాత్రి !

పరాంకుశం మేష్టారు చారూ అన్నంతో భోజనం పూర్తిచేసేరు అందరి ముందు అందుకున్న పర్సును ఆనందంగా ఆశగా తెరిచేరు తనున్న గది తన తల గిర్రుమని తిరిగినట్టైంది ..

అందులోవున్నవి వెయ్యిరూపాయలు కావు! ఒకే పదిరూపాయల నోటు !

రాబోయే మర్నాడు జ్ఞాపకం వచ్చింది.

ఆ పదే ! పదివేలు అనుకుని తృప్తి పడ్డారు మేష్టారు

ప్రజల ముందు పర్సు అందుకున్న మేష్టారికి ముఖ్య అతిథి ద్వారా యిప్పించిన డాక్టర్ రమేష్కే తెల్సు ఈ రహస్యం.




### అంకితం

ప్రఖ్యాత రచయిత నా గురువు అయిన శ్రీ అంగర వెంకట కృష్ణారావుగారికి — ఈ కథ అంకితం.

— రచయిత

# వారఫలం

15–4–1983 శుక్రవారం మొదలు
21–4–1983 గురువారం వరకు

♈ **మేషం** ఈవారంలో ఒకానొక ముఖ్య రంగంలో మీ ప్రతిభ రాణిస్తుంది ముఖ్య బంధువులను కలిసికోనున్నారు అధికారుల మూలాన జరిగేపనులు సుకరంగా నెరవేరుతాయి స్త్రీలకు ఆరోగ్యాభి వృద్ధికి, ధనాదాయానికి మేలైన వారం

♉ **వృషభం** భూములు కొనుగోలు వేయనున్నారు కొందరు గృహ నిర్మాణ కార్య క్రమాభి వృద్ధికి యత్నింప గలరు ముఖ్య బంధువులను కలిసికోగలరు స్త్రీలకు ఉద్యోగాభి వృద్ధికి, నూతనంగా ధనాదాయానికి అవకాశా లుండగలవు సులభంగా ఒకానొక విషయంలో మీకు ప్రగతి యేర్పడ గలదు

♊ **మిథునం.** ధన వృద్ధికి, అప్రయత్న లాభ ప్రాప్తికి అనుకూలం మిత్ర వర్గీయులతో విభేదాలు రాకుండా చూచుకోండి మీతో వివాదపడే వారుంటారు జాగ్రత్త స్త్రీలకు ఉద్యోగాలందు 'ప్రమోషన్' లాంటి అవకాశా లున్నాయి, గ్రహించండి

♋ **కర్కాటకం** శత్రు వర్గం యిబ్బంది తటస్థించే మార్గ మున్నది దానికి తోడు అవకాశ వాదుల తొందరకూడా ఏర్పడ గలదు ఋణ దాతల వత్తిడి కూడా చెప్పదగిన సమయం స్త్రీలకు నూతనంగా ఉద్యోగావ కాశాలు ఏర్పడుతాయి ముఖ్య బంధువులను కలిసికో గలుగుతారు

♌ **సింహం** అధికారులు యిబ్బంది పెట్టకుండా చూచుకోవాలి పోయిన వస్తువులు భోగట్టా తెలిసికో గలరు కొందరకు నూతన వాహనాలు లభించే అవకాశా లున్నాయి స్త్రీలకు శుభ కార్యాలోచన లుంటాయి ముఖ్యులను కలిసికో గలుగు చున్నారు

♍ **కన్య** పోటీపడే వారుంటారు మీ వ్యాపార రంగాన యిబ్బందులు రాకుండా చూచు కోవాలి అభివృద్ధి కార్య క్రమాలు చేపట్ట నున్నారు చాల మంది విషయంలో ప్రయాణావ కాశా లు ఉంటాయి స్త్రీలకు ఎలాగైనా యింట శుభం జరిగే అవకాశ మున్నది కొందరకు ప్రయాణాలు చేయ వలసిన అవసర మున్నది

♎ **తుల** వస్తు వాహనాలు సమకూర్చుకో గలుగుతారు నిర్ణీత కార్య క్రమం ప్రకారం మీ వ్యవహారాలు సాధించ బడతాయి గృహ నిర్మాణం వేయటం, స్థిరాస్తి పెంపకం చేయుటకు ఈవారం ఉపకరింప గలదు స్త్రీలకు అన్ని రంగాలలో సదవకాశాలు లభిస్తాయి వాహనం కొందరకు సమకూడుతుంది

♏ **వృశ్చికం** న్యాయంగా మీకు సంక్రమింప వలసిన వ్యవహారాలలో ధన నష్టం చెప్పదగి యున్నది అధికారుల మన్ననకు అవకాశ మున్నది ప్రతిభ రాణించే అవకాశ మున్నది యత్న కార్య సిద్ధికి అవకాశం గలవారం స్త్రీలకు క్రమంగా మీ ఉద్యోగ వృత్తులందు అభివృద్ధికి, ప్రయాణంలో అవకాశాలకు మేలైన వారం

♐ **ధనుస్సు** ఇష్ట బంధువులతో, మిత్రులతో, పరిచితులతో గోష్ఠి, విందు వినోదాలతో కాలక్షేపం చేస్తారు శ్రద్ధా సక్తులతో వ్యాపారం సుకరంగా జరుపుకో గలుగుతారు కళా సాహితీ రంగంలో నూతనావకాశాలు లభిస్తాయి స్త్రీలకు యత్న కార్య సిద్ధి, నలుగురలో ప్రతిష్ఠ అభివృద్ధి కార్యక్రమంలో మేలు గల వారం

♑ **మకరం** మిత్రుల మూలంగా లాభించే మార్గం, బంధు వర్గీయుల మూలాన అనుకూలత యత్నించిన వ్యాపార రంగంలో అభివృద్ధి కనిపిస్తుంది ఒకానొక విషయంలో అభివృద్ధి సాధించుకో గలరు స్త్రీలకు ధన సంబంధమైన లావాదేవీలలో చిక్కులు తటస్థింప నున్నవి అధికారుల బెడద సంభవించే వారమె

♒ **కుంభం** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి భూములు కొనుగోలు చేయ గలరు కొందరకు ఉద్యోగ ప్రయత్నాలు ఫలవంతం కాగలవు స్త్రీలకు దూర ప్రయాణాలు సాగటం, ఫలించటం జరుగుతుంది కొందరకు వాహన లాభం చేకూరుతుంది

♓ **మీనం** దేవదాయ ధర్మాదాయ సంస్థలందు పని చేసే వారికి సంకట పరిస్థితులు ఏర్పడుతాయి కొందరకు వ్యాపారం సర్వానుకూలం అవసరాలకు డబ్బు చేతికి అందుతుంది కుటుంబ వ్యవస్థలు సాఫీగా జరిగినా ఏదో లోపం కనిపిస్తుంది స్త్రీలకు సుఖ భోగ భాగ్యాలకు కొరత కనిపించదు అప్రయత్నంగా ధనాదాయం, కార్యాను కూలత గలవారం

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి ★

# వ్యక్తిగతం

ఈ 'మరమనిషి' పేరు "ఆండ్రోబట్" గ్రీసు భాషలో ఆండ్రోస్ అంటే మనిషి అర్థం వస్తుంది, రోబట్ అనేది ఈ శతాబ్దంలో కార్ల్ చాపెక్ అనే చెక్ రచయిత తయారుచేసిన మాట [మరమనిషి అనే అర్థం!] దీనిని కాలిఫోర్నియాలోని ఒక సంస్థ తయారు చేసి 2500 డాలరుల చొప్పున [రూపాయలలో 25000 అనుకోవచ్చు కాని స్థానికంగా 2500 డాలరులకి ఇక్కడ 2500 రూపాయలకి ఉన్న విలువ ఉండదు] అమ్ముతున్నారు ఆండ్రోబట్ ఏమి చెయ్యగలదు? ప్రస్తుతానికి పిలిస్తే పలుకుతుంది అంతేట అప్పుడప్పుడు మామూలు మానవులని చూసి "ఎంత వింత ప్రాణి! అయినా మీ చక్రాలు ఏవీ?" అని అడుగుతుందిట కాని, త్వరలోనే ఇది ఇంటి పనులు కొన్ని చెయ్యగలదని తయారీదారులు అంటున్నారు ఉదాహరణకి - ఇంటి కాపలా, ఇల్లు ఊడవటం, చిన్న వస్తువులు తీసుకు రావటం, చెప్పులు తీసి దాచటం వగయిరా ఇప్పటికే పరిశ్రమలో మరమనుషులని బాగా వాడుతున్నారు ఇక ఇళ్ళలో కూడా వాడుతారన్నమాట!

మెలీనామెర్క్యురీ, ఒకప్పుడు సినిమా తార "నెవర్ ఆన్ ఎ సన్‌డే" పాట ఆ పేరు కల సినిమాలో బాగా ప్రసిద్ధి కెక్కింది అందులో నాయిక ఈమే ఇప్పుడు మెలీనా మెర్క్యురీ గ్రీసు దేశం ప్రభుత్వంలో సంస్కృతి, శాస్త్రాల శాఖ మంత్రి. మార్చి 19 నుంచి నాలుగురోజులపాటు భారత దేశం పర్యటించింది ఈమె




## 15

(గత సంచిక తరువాయి)

బాబ్జీ హత్యకేసు జిల్లా సెషన్సు కోర్టులో విచారణకు వచ్చింది పోలీసులు సేకరించిన సాక్ష్యాధారాలతో బహాదీమాగా ఉన్నాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్ మాధవరావు సెషన్సు జడ్జి ఈశ్వరయ్యగారు కోర్టులోకి ప్రవేశించగానే అందరు లేచి నిల్చున్నారు అతను న్యాయపీఠాన్ని అధిష్టించగానే కోర్టులోని వారందరు ఆసీనులయ్యేరు ఆనాడు కోర్టంత కిటకిటలాడుతోంది ప్రేక్షకులతో చాలామంది విలేఖరులు విశాఖపట్నం, విజయనగరం నుండి కూడా వచ్చేరు ఆ విచారణ వినడానికి మహిళా అభ్యుదయ సంఘం ఉపాధ్యక్షురాలు జానకీదేవిగారు హైదరాబాదు నుండి ప్రత్యేకంగ వచ్చేరు ఈ కేసును పరిశీలించడానికి ఆమె పెద్దన్నయ్య శ్రీకాకుళం వాసి అతడు తన చెల్లెలికి ఈ కేసు గురించి తెలియజేస్తే కుతూహలం పట్టలేక, ఇది స్త్రీ జనోద్ధరణ సమస్య గనుక జానకీదేవిగారు వచ్చేసేరు కోర్టుకి దినపత్రిక సంపాదకులు వరకట్న దురాచారానికి సంబంధించిన ఈ కేసుకు ప్రాముఖ్యాన్నిచ్చి తమ ముఖ్య విలేఖర్లని విజయవాడ నుండి ప్రత్యేకంగ పంపెరు ఈ కేసు విచారణను తెలియజేయడానికి

అందరి దృష్టి పబ్లిక్ ప్రాసిక్యూటర్ మాధవరావు పైనే అతడు లేచి ముందుకు వచ్చి కోర్టునంతా హుందాగ పరిశీలించి, ఒక ప్రక్క పోలీసులు ఇరుప్రక్కల కాపల కాస్తుంటే దీనంగ కూర్చోనున్న నీరజను నిశితంగ చూసి తన ప్రారంభోపన్యాసాన్నిచ్చేడు

"గౌరవనీయులైన జడ్జిగారికి, ప్రేక్షక మహాశయులకు నా అభివందనాలు నాకు తెలిసినంతవరకు సెషన్సు కోర్టులో ఇంతమంది జనం గుమిగూడడం యెరగను ఈ హత్యకేసుకు ఇంతటి ప్రాముఖ్యం లభించిందంటే దానికి ముఖ్య కారణం దీనిలోని హింస మాత్రమేకాదు, దీనిలోని ఆశ్చర్యకరమైన సంఘటనే ఆవేశంలో, కొన్ని కొన్ని పరిస్థితులలో ఉద్రేకం పట్టలేక భర్త భార్యను చంపడం, భార్యా భర్తను చంపడం యెరుగుదుము, అట్లాంటి కేసులు ఈ గౌరవనీయమైన కోర్టులో ఎన్నో విచారణకు వచ్చేయి కాని ఏ కారణము లేక, ఉట్టి కోపమే కారణంగా పెట్టుకుని నిద్రపోతున్న రోగిని నర్సుగ కాపాడవల్సిన బాధ్యతను విస్మరించి, ఆ నర్సే తాపిగ విషమిచ్చి తన భర్తే ఆ రోగి అని తెల్సుకుని కూడ విషమిచ్చి చంపిందంటే ఆమెలోని క్రౌర్యానికి మనం విస్మయం చెందాలి ఆమె అవివేకికాదు ఇంటర్ వరకు చదువుకున్న వివేకి కూలినాలి చేసుకుని బ్రతికే అవిజ్ఞురాలు కాదు ఆమె తండ్రి స్కూలు మేస్టరు ఆమె భర్త బ్యాంకులోని క్యాషియర్ ఆమె చేస్తున్న ఉద్యోగం పేరున్న హాస్పిటల్‌లో నర్సు ఇంతటి విజ్ఞురాలు ఆమె ఇట్లాంటి కోల్డ్ బ్లడెడ్ మర్డరు చేసిందంటే ఆమెలోని దౌష్ట్యాన్ని, సేడిజంను మనం గుర్తించక తప్పదు ఆమె క్షణికోద్రేకంతో చేసిన పనికాదిది ఆమె ఎన్నాళ్లనుంచో వేసుకున్న పథకమిది అదిగో వాది తరఫున వాదించబోయే లాయరుగారు నావైపు కోపంగ చూస్తున్నారు"

"ఐ అబ్జక్టు దట్ రిఫరెన్సు యువరానర్," అని లాయరు దామోదరం అన్నారు

"మిస్టర్ పబ్లిక్ ప్రాసిక్యూటర్—నో పర్సనల్ రెఫరెన్సెస్ ప్లీజ్"

"సారీ యువర్ ఆనర్ నేను నా ఈ ఉపన్యాసంలో చెప్పే ప్రతివిషయాన్ని సాక్ష్యాధారాలతో నిరూపించదలచేను"

"ప్రొసీడ్," అన్నారు జడ్జి ఈశ్వరయ్యగారు చిరునవ్వుతో అతనికి తెల్సు పబ్లిక్ ప్రాసిక్యూటర్ మాధవరావుకి, లీడింగు క్రిమినల్ లాయర్ దామోదరంకు మధ్యనున్న కోర్టులోని వైరం మళ్ళీ బయట స్నేహితులే కోర్టులో మాత్రం పులి, సింహం మాదిరి హుంకురించుకుంటారు

"మొట్టమొదటి సాక్షి మోహనరావు శవాన్ని పోస్టుమార్టమ్ చేసిన డాక్టరు ముకుందం"

డాక్టరు ముకుందం వచ్చి "దేముడిమీద ప్రమాణం చేసి అంతా నిజం చెప్తాను," అని పలికిం తరువాత పబ్లిక్ ప్రాసిక్యూటర్ మాధవరావుగారు ప్రాసిక్యూషన్ సాక్షిని విచారించేరు

"మీ పేరు?"

"ముకుందం"

"మీ ఉద్యోగం?"

"గవర్నమెంటు హాస్పిటల్‌లో డాక్టరు"

"మీరు ఆగస్టు 23వ తారీఖున ఏ శవాన్నైనా పోస్టుమార్టమ్ చేసేరా?"

"రెండు శవాలు చేసేను"

"ఎవరెవరివి ఆ దేహాలు?"

"మొదటిది మోహనరావు బాబ్జీ అనే ఆసామిది, రెండవది వసుమతి అనే స్త్రీది"

"మోహనరావు బాబ్జీ ఏ వ్యాధివల్ల చనిపోయేడో నిర్ధారణగ చెప్పండి?"

"అతడు విపరీతంగ మార్ఫిన్ ఇంజక్షను ద్వారా రక్తంలోకి ప్రసారింపబడటం వల్ల చనిపోయేడు"

"మీరు వెళ్ళొచ్చు ఆగండి! బహుశా డిఫెన్సు లాయరుగారు మిమ్మల్ని క్రాసు ఎగ్జామినేషను చేయొచ్చు"

దామోదరంగారు లేచి సాక్షి నిల్చున్న బోను దగ్గర కెళ్ళేరు

"ఇందాక మీరు విపరీతంగ మార్ఫిన్ ఇవ్వబడిందన్నారే — విపరీతంగ అంటే ఎంతండి?"

"నా ఉద్దేశంలో సుమారు పది సెంటిగ్రాముల వరకు ఇచ్చి ఉండవచ్చు మామూలు డోసు పది మిల్లీగ్రాములు ఇస్తే నిద్ర వచ్చి శరీరంలో ఏమైన బాధ ఉంటే ఆ బాధ ఇంజక్షను ఇచ్చిన పది నిముషాల తరువాత మరి తెలియదు ఆ ఇంజక్షను యొక్క ధాటి సుమారు నాలుగు గంటల నుండి ఆరు గంటల వరకు ఉంటుంది అట్లాంటిది పది సెంటిగ్రాముల మార్ఫీను ఇంజక్షనుగా ఇస్తే పదిహేను నిముషాల లోపున మరణం సంభవిస్తుంది"

"మరి బాధ నివారణకు మార్ఫీను ఇస్తారు కదా మరి మరణం ఎలా సంభవిస్తుంది?"

"ఏదైన మితిమీరుతే ప్రమాదమే కదా అందులో మార్ఫీను ఊపిరితిత్తులపైన పనిచేసి ఊపిరిపై వత్తిడి అధికమై క్రమేపి ఊపిరి ఆగిపోతుంది దాంతోపాటు రక్తప్రసారము ఆగిపోతుంది ఈ రెండు లేక ఏ ఒక్క కారణము చేతనైన మనిషి చనిపోవచ్చు"

"మోహనరావు ఈ మార్ఫీన్‌వల్ల కాకుండ,

---

**జరిగిన కథ — 9.** నీరజ ఓ హాస్పటల్‌లో నర్సు అదే హాస్పటల్‌లో పనిచేస్తున్న డాక్టర్ కృష్ణ నీరజ గతం ఏమైనప్పటికీ ఆమెను పెండ్లి చేసుకొంటానని చెప్తాడు ఫైర్ ఆక్సిడెంట్‌లో వళ్ళుకాలి ఆ హాస్పటల్‌లో జేరిన వసుమతినుంచి సమాచారం సేకరించటానికి నిర్ణయించుకొంటుంది నీరజ వసుమతికి స్పృహ వస్తుంది ఆమె తనకు జరిగిన అన్యాయాన్ని నీరజతో చెప్పుకొని కన్ను మూస్తుంది గతంలో ఆ బాబ్జీ అనే మోహనరావే తన అమ్మతో కలిసి ఇదే విధంగా నీరజను చంపబోతే తప్పించుకొంటుంది ఇక అతన్ని వదిలిపెడితే మరో ఆడదాన్కి అన్యాయం జరుగుతుందని మోహనరావ్‌ని చంపేసి జైలుకెళ్తుంది నీరజ ఆమెను ఉరికంబం నుండి తప్పించడాన్కి డా॥ కృష్ణ, వసుమతి తండ్రి బంగారయ్య ప్రయత్నిస్తుంటారు డిఫెన్స్‌కి క్రిమినల్ అడ్వకేట్ దామోదరంను డా॥ కృష్ణ కుదురుస్తాడు సుబ్బాయమ్మ తన మామతో జరిగిన విషయాలన్నీ వివరిస్తుంది అతను కూడా తమ తరఫున వాదించటాన్కి మంచి పేరున్న ప్లీడర్ కోసం ప్రయత్నిస్తుంటాడు